# శరణార్థిని




రచయిత - ప్రకాశకులు,

కోవిద, విద్యాప్రవీణ, పండిత,

## శ్రీ భళ్లముడి సీతారామమూర్తి

శ్రీ మహారాజావారి హైస్కూల్,

పర్లాకిమిడి,

(గంజాం జిల్లా.)





అన్ని హక్కులు గ్రంథకర్తవి.


వెల 1—0—0

ఓం.

# తొలి పలుకు

'శోకాగ్ని' అను ఈ చిన్ని కావ్యానికి తొలిపలుకు నేను వ్రాయటానికి కారణం 'కృతికర్త' కవిమిత్రులునయిన శ్రీ సీతారామమూర్తిగారి సుహృదను శాసనం. బాల్యం నుండీ వారికుండే కవిత్వాభిలాషా, భావోదాత్తమైన పాటలూ, పద్యాలూ రచించే వారి అపూర్వ కవితాశక్తీ, నాకు తెలుసును. వారి కంఠం మధురం, హృదయం మసృణం, కావున కవిత్వం మధురంగా ఉంటుందని, వేరే చెప్పనక్కరలేదు. ఈవికీ, కీవికీ విఖ్యాతమైన వంశములో జన్మించేరు, శ్రీ సీతారామమూర్తిగారు. నిరాడంబరమైన జీవితం గడుపుతూ, కష్టజీవుల ఆవేదనను అర్థం చేసుకొని, వారి బాధ తనదిగా భావించి కరగి మరిగే కోమల హృదయం వీరిది. అలాంటి హృదయం నుండి ఇలాంటి కావ్యం వెలువడటంలో ఆశ్చర్యమేముంది ?

ఈ కావ్యంలోని ఇతివృత్తం పౌరాణికంగాని, చారిత్రికంగాని కాదు. మరి ఒక అనాథయైన ఇల్లాలి విషాదాంత జీవితగాథ. కావ్యం భారతభూమి వర్ణనతో ప్రారంభం అవుతోంది.

సీ॥ శ్రీసదావాసమ్ము శ్రేయోవిలాసమ్ము
సత్కళానంద విశ్రామభూమి
ప్రేమస్రవంతి కోద్దామ ప్రవాహమ్ము
సత్యవిజ్ఞాన విశ్వాసభూష
సంగీత సాహిత్య శృంగారభూమిక
మంగళ కామనారంగభూమి
అధ్యాత్మభావ సాధ్యాపనాయతవేది
కరుణార్ద్ర ఘాటికకర్మపీఠి

తే॥గీ॥ ప్రథిత భరతమ్ము ఖండమ్ము భారతమ్ము
రత్ననగరత్న నగరవిరాజితమ్ము
నదనదీస్వాదు జలకల నాదముదిత
నవనవోన్మేష సస్యపూర్ణమ్ము నహా! హా!

కావ్యంలోని కథకు ఇట్టి వర్ణనతో ప్రారంభం ఎంతో చక్కగా ఉంది. అందు లాహోరు నగరం. ఆ నగరాన్ని 'కడుపుగడుపగ' దూర ప్రవాసి ఒకడు అర్థాంగ లక్ష్మితో కూడ, చేరినాడు. కష్టజీవి రెక్కాడితే డొక్కాడుతుంది. కాయకష్టమే అతనికి ఆప్త బంధువు.

గీ॥ "దూరదేశాన 'నా' యను వారలెవరు,
లేక 'రెక్కాడ' డొక్కాడు లేమిబ్రతుకె
యైనకష్టించి సంతృప్తియైనబ్రతుకు
బ్రతుకుచుండిరి మథకథా బంధులచట.

ఇలా కొన్నేండ్లు వారికి గడచేయి. ఇంతలో

"మిన్కుమినుకని లోలోన మెఱయుచున్న
భవ్యదాంపత్య జీవన భవనమునకు
వెలుఁగునగు పాపకలుగు చిన్నెలునుచూపె"

ఇచ్చటుపడిన అలంకారం నిజంగా వెలుగువంటిదే. కాలం ఒక్క తీరుగా వెళ్లదు. భారతదేశం రెండు ముక్కలయింది. మతకలహ మహా ప్రళయం ముంచుకొచ్చింది. మానవుని ఆత్మోన్నత్యంకోసం ఏర్పడిన మతం

మానవుని ధ్వంసానికి కారణమయింది. మతకలహ మారణహోమంలో పడి నశించిన వేలకొలది కుటుంబాల దురవస్థను వర్ణించిన ఘట్టం హృదయ విదారకం. మతావేశానికి లోనయిన మానవులు రాక్షసులకంటె హీనంగా

"తల్లులయొడుల పాల్ద్రావుపిల్లలఁ జిమ్మి,
చెండులవలెతలల్ చెండువారు,
ఒకలంబిసుగుచు, ప్రేగులంబీకుచు
గ్రుడ్లూడదీయుచు గ్రుద్దువారు

నిండుచూలాండ్రను ఖండించి గర్భస్థ
పిండస్థితిని చూచుచుండువారు
మానభంగము కొపంబడని మానవతుల
బంధించి పశువృత్తిఁ బరగువారు

రౌద్రభీభత్స మత్తకరాళ రూప
ములను దాల్చినయమమృత్యు ముఖులువారు
మారణాయత్త యంత్రాల మాడ్కికోరి,
ఘోరవిధ్వంస సల్పిరి క్రూరులగుచు,

ఈ పెను ప్రళయంలో చిక్కుకొన్న కథానాయకుడు యీ అంధ లోకాన్ని వీడి తన యిల్లాలిని అనాథనుచేసి పోతాడు. మందుబెడారిలో ప్రసవలే ఒక వుదారహృదయుడగు వైద్యుడీమె కాశ్రయమిస్తాడు, కాని విధికి ఆమెపై కనికర లేదు.

"నెల గడచెనొ లేదో ఆ నెలతపయిన్
వెజ్జునాలి నీచపుదృష్టిన్
తలపడి యనుమానింపగఁ గలతలు
గృహమందుఁబుట్టెఁ గలికిపోగులగన్".

ఇంకెలా ఉండగలదాయింట్లో ? ఇలువిడి ఆ నిండుచూలాలు కష్టపడి జీవించటానికి ప్రయత్నిస్తుంది ; కాని గర్భభారంచే కష్టజీవనానికి అనువుగాక భిక్షావృత్తి ఇష్టం లేకపోయినా ఆమె అవలంబించవలసి వస్తుంది. ఈ సందర్భంలో కవి వర్ణించిన నిరుపేదల దుస్థితిఘట్టం చదువుతూ ఉంటే ఎంతటి శిలాహృదయునైనా దుఃఖఘాతం రాక తీరదు.

"కఱగినగుండెతో మఱిగి కారిన బాష్పపుధారతో నదె
కరుణరసమ్ముఁజిమ్ము నొకగాజుకలమ్మునుఁ జేతబట్టి
బరువుభరింపలేని అతిభావుకు"డగు కవి వ్రాసిపెట్టిన
కావ్యమియ్యది.

ఆ సందర్భంలోని పద్యాలు భావగంభీరములు. కవిత్వం సరళం మధురం, ఉదారం. కవియొక్క క్రాంతి దర్శిత్వమిట సువ్యక్తం. రచన ధారాశుద్ధి కలిగి, అర్థానురూపమైన శబ్దవిన్యాసంతో భావంపు తావుల గుమగుమలు గుభాళించుచు పసవులిడు నట్టిది. కబ్బంలో కటుత్వం కనబడదు. భిక్షకోసం బయలుదేరిన నిండుచూలాలు ఆ అనాథను భావించి కవి హృదయం కలత చెందింది. ఇక అతని కలంలోంచి చిలుకునట్టి పలుకులు......

చం. ప్రణయతరంగ డోలికలపై మధురమ్ము నగాధమైన, జీ
వనపథమందు మోదమొదవం బయనించిన యా విలాస నౌ
కననిటు లోతుఫాను పెనుగడ్డయి యడ్డుట ముగ్గుచుండె, నెం
దును దరిఁజేరనేరని నవేగతిపట్టి మునుంగకుండునే.”

చం. “ఇదియొక సిద్ధహస్తుడగు నీశ్వరశిల్పి యనల్పకల్పనా
భ్యుదయముఁజూపి మానవవిభూతిని లోకునెఱింగి నేర్పుతో
పొదిపిన ప్రేమమందిర మపూర్ణమునై శిథిలావశేషమై
తుడగనుచుండెనిప్డు పరిభూత ధరాధిపరాంతరాప్తమై.

చం. మొలకలుఁద్రోసి మోసలకు ముచ్చటరేకులుమూపి లేగొనల్
మెలికలువాఱి పూతకెలమిందలపెట్టిన తీవయిద్ది జా
బిలిచలువన్ వలంచి తొలిఁబెట్టిన యా కళికమ్ము నింక నీ
వలగనరాదు వ్రేటుపడెవాడుట మూడుటకాద చూడమే ?

చం. కఱగినగుండెతో మఱిగికారిన బాష్పపుధారలో నదే
కరుణరసమ్ముఁ జిమ్ము నొకగాజుకలమ్మునుఁజేతఁబట్టి, యే
బరువుభరించలేని యతిభావుకుడే కవివ్రాసిపెట్టెనో
చెరుగుచునున్నదీ కవిత జీర్ణములై ఎడిపోవపర్ణముల్.

చం. ముదిమియుసఁబౌము, జుట్టునటు, ముంగురులన్ ఎగఁబెట్టఁ బోదు ముం
దడుగిడలేదు, సొంతతడియారిన నూరటలేదు గోడునన్
తుడువగలేదు చెమ్మటలు తూలుచుఁ దూలుచుఁ బోవు నామె యే
గడపనొ కాల్చెనున్ క్షణముగర్భభరమ్మతి దుర్భరమ్ముగన్.

ఈ విధంగా భిక్షకోసం బయల్వెడలిన ఆ అనాథ హృదంతరంలో ఆశా జ్యోతి ఆరిపోలేదు.

ఉ. నిండదు భగ్నపాత్ర మదినిండఁదలంపును లేదెవ్వరో
గుండెకలిట్టివాడు తనకోకబళమ్ము నుఁబెట్టునందు రం
చెండిన యాసమాతగని యేగుచునున్నది దీనురాలు, తో
వెండిన మాకురాలి నుడులెత్తిన గాడ్పునముక్కలైచనున్.

కాని లోకంలో మానవరూపంలో రాక్షసులున్నారని, కవి చూపిస్తారు. మానవత్వానికి కళంకం ఐన మదాంధుడగు ధనమంతుని ప్రవర్తన, శరణార్థిని దుస్థితి, ఆ సమయంలోనే ఆమె ప్రసవం, తోడికష్టజీవులా అనాథ శిశువును ఆదరించటం, మరణిస్తూన్న శరణార్థిని బిడ్డకొసంగిన సందేశం, అనే ఘట్టాలు కరుణారస పరిప్లుతాలు. శరణార్థిని ఒసంగిన సందేశం భారతజాతి ఉత్తమ ధర్మాలకు, ఉత్తమ సంస్కృతికి ప్రతిబింబం, అది ఒక ఉత్కృష్టరత్నం. దానికి వెల కట్టటం కష్టం. ఆ బాధ్యత రస గ్రహణ పారీణులయిన చదువరులకే విడిచిపెట్టాను. కవి చెప్పినట్లు 'లౌకికము, నాగరకతయు, మాకుఁదెలియునటంచు గర్వించి పత్రికలట్రైతిప్ప

సహజమాదయసౌశీల్య, శాంతస్వాస్థ్యలబ్ధుని డబ్బుగలిగిన గట్టివాళ్ళకు' ఈ సం దేశం అర్థంకాకపోవచ్చు. కాని సుఖదుఃఖానుభవ సంజనిత సుగుణ సంపత్పరిపూత కోమల హృదయులకు సామాన్యులకిది ఒక అమృత స్రవంతియే. మరణిస్తూన్న తల్లి కుమారున కిచ్చిన సందేశంలోని కొన్ని పద్యాలు.

ఉ. "మాతృఋణమ్ముఁదీర్చుకొనుమా! కనుమా నిజ
మానుషత్వమే
రీతినిఁబాతమాని విపరీతమతమ్ముల నమ్మఁబోకుమా
చేతల, నీతి, ప్రాతల విశేషతఁబ్రాప్తము మర్త్యజాతి కిం
చేతనమొప్పగా నమరజీవివి కావలెనిప్డు పుత్రకా."

ఉ. "జాతిమతాది మార్గములు సంకుచితమ్ములు పంకకంటకో
పేతములట్టిఁజేసి యవివేకులు ప్రముచ్చులు విశ్వసౌహృదా
ఘాతమొనర్చుచుండిరికఁ గావలెభావవిశాలమార్గముల్.
ఆ తలపుల్ వెలార్పుమున యానునయమ్ముల నిప్పుత్రకా!"

ఉ. "పూతలుపట్టిపై మురిగిముక్కుచునున్న వివాహసూత్రముల్
తాతలఁగోతులట్టరసి తాముతలందల పెద్దలైరి, యే
కూతలొ వ్రాతలై వెలయు కాటికిగూటికి వాచిరెందఱో
నీతిబలమ్ము కావయునిప్పుడు నీవదికాచ్చు పుత్రకా !"

ఈ విధంగా కావ్యం విషాద సందేశంతో పూర్తి అవుతుంది. పాఠకుల బరువైన గుండెల్లో నిట్టూర్పులు చేస్తాడీకవి. ఇట్టి కావ్యాలే ఈనాడు

అవసరం. మానవజాతిని మానవత్వమార్గంలో పెట్టటానికిట్టి కావ్యాలెంతో ఉపకరిస్తాయి. ఈ కావ్యం పరిమాణంలో చిన్నదైనా గుణంలో పెద్దది. శ్రీ సీతారామమూర్తిగారు ముందుముందు ఇంతకంటే ఉత్కృష్టమైన కావ్య సుమాలతో ఆంధ్రభాషామాతను అలంకరించగల రనటంలో సందేహం లేదు. ఈ గ్రంథాన్ని ఆంధ్రలోకం ఆదరించి ఈ నవ్యకవికి ఇతోధిక ప్రోత్సాహాన్నివ్వ గలదని ఆశిస్తున్నాను.

ఇట్లు,
సాహిత్యవిద్యాప్రవీణ, భాషాప్రవీణ,
అయల సోమయాజుల నరసింగరావు,
ఎమ్.ఏ.,బి.ఒ.ఎల్.,
(ఆంధ్రభాషోపన్యాసకులు),
కృష్ణచంద్ర గజపతి కాలేజీ,
పర్లాకిమిడి.

# మనవి

రసిక హృదయ పరిసన్నాను రాగరేఖ
నిస్తమః ప్రక్రియాద్యుతి విస్తృతిగన
సంతరంగమ్మున న్నిల్చి యాడుహాయి
నాకృతికుమారి మీ దీవనలను వలచి.

అమూల్య కాలవ్యయమును శ్రమను, లెక్కించక "తొలిపలుకు"న శరణార్థినికి తన సదభిప్రాయమును ప్రసాదించిన—

అచర్చప్రాయులు, సహృదయులు, ప్రజ్ఞానిధులు, మన్మిత్రులునైన,
సాహిత్య విద్యాప్రవీణ, ఉభయభాషా ప్రవీణ,
బ్రహ్మశ్రీ అయలసోమయాజుల నరసింగరావు,
ఎమ్.ఎ.,బి.ఒ.ఎల్. గారికిని,

శిష్యవాత్సల్యమునుంజూపి, వారి శుభాశీస్సులతో "శరణార్థి"ని ముద్రితముగాఁజేసిన—

శ్రీమద్గురువరులు, అనంతప్రతిభా విశిష్టులు, సాహిత్య శిరోమణి,
మీమాంసా విద్యాప్రవీణ, ఆయుర్వేదాచార్య, కవిరాజ
బ్రహ్మశ్రీ అనంత త్రిపాఠీ శర్మ, ఎమ్.ఏ. గారికిని,

నా యుత్సాహమును ద్విగుణీకృతముగా జేసిన శ్రీయుతులు నాయాత్మమిత్ర సహోపాధ్యాయుబకును—

కృతజ్ఞతాభి వందనములు.

ఇట్లు విధేయుడు,
భ. సీతారామమూర్తి,
గ్రంథకర్త.

ఓం.

# కృతి సమర్పణ

ప్రథిత వేంకట సూర్యనారాయణాఖ్య
జనకుఁ గామేశ్వరమ్మను జననిఁ బూజ
చేయు కోర్కెను సద్భావశిష్ట కృతి స
మర్పణముసేతు దీనిఁగృతార్థత గన॥

అమ్మ కమ్మని యెదవిరి చిమ్ము తేనె
నాన్న విన్నాణముల వెల్గు వెన్నెలలను
గ్రోలి రూపేర్పఁ గన్న నా కూర్మికూర్పు
సత్కృతిగ నిత్తువారి కంజలి ఘటించి

ఓం.

శ్రీల నొసంగ గన్మొదము సేమముఁ గూర్పగ భవ్యమూర్తి వై
లాలిత సత్కళా లలిత లాస్యపు లీలయి నోలలాడుచున్
సకాలిక శక్తి నిచ్చి "అహమస్మి" యనంగఁ గృతార్థుఁ జేయగన్
జాలుదు వీవెవాణి! నినుఁ జాలగ నమ్మితినమ్మి! అమ్మరో!

నా నోటం బలికించుచున్నయది తా నా మాతయే, బ్రాహ్మియే,
జ్ఞా నానందమయ స్వరూపిణియె, ప్రజ్ఞావాహ్య కల్యాణియే,
ధ్యా నాధాన రసత్సుధామధుర వాగ్ధారావతారమ్మునన్
నా నాదోపహార ప్రసన్నతను విన్నాణమ్ముతోఁ జిమ్మెడిన్"

దినదిన వర్ధమానమగు తియ్యని సత్కవితారసమ్ము గ్రో
లినని కన్నిచప్పనయి లెక్కకు దొక్కకఁ జిక్కకుండుచు, నే
లనగ భవత్కృతిప్రతిభ కందఱమందముదమ్ము నంద మీ
వెనుక మిగిల్చి కొంతయుచిఁ బెట్టుట సత్కవులార మ్రొక్కెదన్.



ఓం.

# శరణార్థిని

---

## శ్రీకారము

శ్రీసదావాసమ్ము శ్రేయోవిలాసమ్ము
సత్కళానంద విశ్రామభూమి
ప్రేమస్రవంతికోద్దామ ప్రవాహమ్ము
సత్యవిజ్ఞాన విన్యాసభూష
సంగీతసాహిత్య శృంగార భూమిక
మంగళకామ నారంగభూమి
అధ్యాత్మభావ నాధ్యాపనాయఃతవేది
కరుణార్ద్రవాటిక కర్మపీఠి

ప్రథిత భరతమ్ము ఖండమ్ము భారతమ్ము
రత్న-నగరత్న-నగర-విరాజితమ్ము
నదనదీస్వాదు జలకలనాదముదిత
నవనవోన్మేష సస్యపూర్ణమ్ము నహా ! హా !

"-వర్ణనాతీతమందాక వరపురమ్ము"...

మ॥ అది "లాహోరటవారు "హిందు ముసిలిమ్మన్న"
ప్రభేదమ్ములన్
ఎన్నడలో నెంచక "భాయిభాయి" యనియెన్నే
నేండ్లుగానుండి రే
యదరుంబోరును లేక నెయ్యమును వియ్యమ్మంది,
యింపొంది, యా
పదలందొక్కరి కొక్కరాప్త గతితోట్పాటౌదు రా
నాటికిన్"

తే॥ గీ॥ కడుపుఁగడపగ నచటనౌకరి లభింప
వలసపోయెను దూరప్రవాసి యొకఁడు.
ఆతని యర్ధాంగ లక్ష్మియే యగుటఁజేసి
తోడునీడగ భార్యతోడ్తోడనేగె.

ఉ॥ దూరపు దేశమేగి తమ దుఃఖసుఖమ్ములఁజూచు బంధు లె
వ్వారును లేనిచోట ఋజువర్తనులైయుట వారిమైత్రితో
తీఁచినేర్చి కాపురపుఁ దీపులనోపినదీనదంపతుల్
వారలు నాకలమ్మునకు బందుగులిందును ముందుముందునన్

తే॥ గీ॥ దూరదేశాన "నా" యను వారలెవరు
లేక, "రెక్కాడనొక్కాడు" లేమి బ్రతుకె
యైన, ఁగప్టించి సంతృప్తమైబ్రతుకు-
బ్రతుకుచుండిరి మనకథా బంధులచట.

మ॥ ధనధాన్యమ్ములు లేవు లేవను మనోదౌర్బల్యమే లేద 'యి
మ్మని' యాచింపక, కాయకష్టమున సంపాదించి సంతృప్త జీ
వనమాధుర్యముఁ గ్రోలుచుండి, తమదాంపత్యంబు 'నాదర్శమౌ
నను నట్లుండిరి వారలిద్దర తులానందాంబుధిన్ దేలుచున్.

తే॥ గీ॥ ఇట్టివారికిఁ గొన్నేండ్లె యేగెనచట
మిన్కుమినుకని లోలోన మెఱయుచున్న
భవ్యదాంపత్య జీవన భవనమునకు
వెలుఁగునగు పాపకలుగు చిన్నెలును చూపె॥

చం॥ ఉచితసపర్యలన్, మధువులొల్కెడి మాటల నాటపాటలన్
రుచికరభోజనమ్ముల వమ్ంబరితృప్తునిఁజేసి చెంత నా
సుచరితముచ్చటల్ గురియఁ జొక్కఁపులీలల దేలు నొక్క నా
డచలమనోనురాగమున నవ్విభుఁ డామెనుఁజూచి యిట్లనున్॥

కం॥ దైవీగుణ సంపద నీ
కైవసమొనరించి సృష్టిఘనతను గాంచెన్
నీ వైననాడె పురుషుని
జీవితమున నొక్క వెలుఁగు చెలఁగును కలికీ!

శా॥ కంటన్నీ మనుఁ జంటఁ బాలునొలుకన్ గారుణ్యవాత్సల్యముల్
జంటన్ రూపఱినట్టి భవ్యముభవజ్జన్మంబహో ! భామినీ !
పంటల్ భాగ్యములెన్నియున్నఁ బురుషప్రాగల్భ్య మర్థంబెన
ట్టింటన్ బచ్చగ మీపనిల్చు సిరియెుండే నింతుసంపత్తులా।

కం॥ అనిపలికిన ప్రియుపలుకుల
గానములఁ దనమనమునందుఁ గొనియాడుచు, ని
ట్లొనఁగూర్చు దీనబంధుని
వినుతించుచు లేమ మురిసి విభుతోననియెన్॥

తే॥ గీ॥ మధురహృదయులు, సౌమ్యులు, మంచి మాత్రి
మునె గ్రహించెదు సత్ప్రవర్తనులు మీరు
కాన మనబ్రతు కానందకరముకాగఁ
గడచుచుండుట నిదియె భాగ్యమ్ము నాకు॥

తే॥ గీ॥ ఇటుల నొండొరుల్ నైజసంతృప్తిఁ గలిగి
సంతతానంద కందళితాంతరంగు
లగుచు, జీవన మధురిమలానియాని
కాలవాహినిలో కొంతకడచినంత॥

# పరివర్తనము

ఉ॥ నిండు పెడంద జీవనము నిచ్చలుఁ ధారలు వోసిపోసి యా
పండితరాణ్మహాత్ముల యపారకృషిన్ ఫలియించె సర్వతో
ద్దండుల చేతినుండి వెలిఁదప్పిన భారతభూమి, చెక్కలై
రెండుగఁ జేయ నెంచి రొకరిద్దరు గద్దియదిద్దు బుద్ధితో॥

తే॥ గీ॥ 'వేరు వేరుగ దేశము విభజనమ్ము
సలుపవలె'నన్న తీర్మానములు చెలంగె
'హిందుముస్లిమ్' ప్రభేదమ్ము క్రిందుకొనియె
భయదదుర్నీతి ప్రజలలోఁ బ్రబలఁజొచ్చె॥

కం॥ వాతలునై కోతలునై ఈతలఁపులు ప్రజలవెతకు
హేతువులయ్యెన్
హేతులఁలోతులఁ జూచుందాతలనీతులను లోతుఁ
దలపండొకఁడున్॥

ఉ॥ స్వార్థపిశాచమూనుట విషాక్తమదాంధులు వైరవహ్నులన్
వ్యర్థముగారగిల్చి నరభస్మము సేయుదురంతె కాక యే
కార్థములై మహత్తర వికాసములౌ మతసూక్తులవ్వి య
త్యర్థకఠోరఘాతుక కదర్థములెట్లగు నేడు రేపునున్॥

చం॥ చిఱుకెరటాలతో మధురజీవనముల్ తెఱతేరిపార బం
ధురసుమనస్సమీర పరిధూత మనోహర కాలనిర్ఝరిన్
హారకృతమర్త్యమారణ మహావ్యవహార కరాళలీల భీ
కరమత్తవైర ముప్పెనలుగప్పెను ముప్పాలగుప్పి చప్పనన్॥

సీ॥ తల్లులయొడుల పాల్ద్రాగుపిల్లలఁజిమ్మి
చెండులవలె తలల్ జెండువారు
పీకలంబిసుగుచుఁ బ్రేగులంబీకుచు
గ్రుడ్లూడదీయుచు గ్రుద్దువారు
నిండుచూలాండ్రను ఖండించి గర్భస్థ
పిండస్థితిని చూచుచుండువారు
మానభంగము కోడంబడని మానవతుల
బంధించి పశువృత్తిఁ బరగువారు.

తే॥ గీ॥ రౌద్రబీభత్స మత్తకరాళరూప
ములను దాల్చిన యపమృత్యుముఖులువారు
మారణాయత్త యంత్రాలమాడ్కి-కోరి
ఘోరవిధ్వంససల్పిరి క్రూరులగుచు॥

తే॥ గీ॥ అచటివారలు డెబ్బదియైదుపాళ్లు
తలుపులను బిగియించి యీవలకురాక
ప్రాణములు పిడికిటఁబట్టి పగలు రేలు
బ్రతుకుచుండిరి జీవచ్ఛవంబులట్లు॥

తే॥ గీ॥ ఆ మహాఘోరములఁ గనులారగాంచు
వారికాహారనిద్రలు దూరమగుట
బెంగపడికృంగి యారోగ్యభంగమగుట
వింతయే ? వింతరోగాలు విస్తరిలుట !

కం॥ తమజీవనవృత్తికి భంగమువాటిల నాపుతాంధ
కలహామువలనన్
క్షమయెంతకలిగియున్నను, శ్రమహెచ్చాయి మనప్రవాస
సఖులను వేచెన్॥

కం॥ తనపతి యారోగ్యము దినదినముసఁ జెడిమిగుల దుస్థి
తినిఁజూపగ నా
వనిత మనమ్మునభీతిలి యనెనాతనితోడఁ గనుల
నశ్రులుగ్రమ్మన్॥

శా॥ మీయారోగ్యము నాయువున్న నది యే మేలొందు
నాకేల ? మీ
కాయాసమ్మగుచుండె నే దినము నీ కర్కోట
కాలాహతిన్.
కాయో కూరయొ చాలుతిండికిది యే కష్టమ్ముగా
నుండె. నే
కేయిన్ హా యన లేదు పో ! క్షణము నిద్రింపంగఁ
గన్మాసిరే !

ఉ॥ చేయఁ బట్టినంత పనిఁ జేయుచునుంటిని గాని యింతకో
సాయముఁ జేయఁజాలుదు నే! చాలదు రెక్కలుముక్కలైన, లే
దాయెనుపాయమేదియును. దాపురమయ్యెను బీదకాపురా
'లో' యని యేడ్చు కాలమిది యోర్చుటయెట్లిది
యీడ్చు టేగతిన్॥

ఉ॥ ఆ యెడ నే విషాదనదమాగక సాగెనొ ? దోగి యశ్రువుల్
పాయలుగట్టి పారె తనపాలిన చెక్కులమీద. లోననే
దో ! యది చెప్పలేని వెత దుర్భరమౌటను మేనువ్రాల్చె నా
తోయజనేత్రనాథునవిదూర దయాహృదయమ్మునమ్ముచున్॥

తే॥ గీ॥ "బితుకుబతుకని" గుండెలు బెదరుచుండ
నిదురపట్టునె ? ఐననో నిముసమిట్టె
కన్నుమూసిరి. యింతలోఁ గలకలమ్ము
పెమ్మ్రొనె నిండ్లుగాల్చిరి. బొమ్మజరిగె॥

మ॥ మతవిద్వేష భయానక ప్రళయ శుంభన్మారుతోద్ధూతి నా
తతశాఖల్ జనశాఖులాహత సముత్పాటమ్ము లంద్రెళ్లె. సు
ధృతవృక్షమ్ములపాటుచేనలుగుఁ దత్ప్రాంతాల్పవృక్షమ్ము లీ
గతిఁనస్మత్కృతి బంధుసుందగిలె నా ఘాతమ్ము పాయమ్మునగా॥

క౦॥ ఏ యన్యాయమెఱుంగడ మాయికుఁడావంత పొంతె
మాటలు తెలపం.
డాయనకు నిట్టియాపద జేయఁగఁజేయూడె నెట్లొ
చెప్పుమా! విధికిన్॥

ఆ॥ వె॥ వారియాత్మ తృప్తి వర్తనమ్మును వారి
దూరదృష్టి నైజతుష్టి పుష్టి
దారిఁజూపు వారి పారస్పరిక ప్రేమ
యైనవిధియె వారికడ్డమయ్యె.

క౦॥ ఆ దంపతుల మనమ్ముల మోదము హతమార్చె విధియె
ముష్కరుడగుచున్,
ఏ దేమియైన నాయమ ఖేదముఁగనని వరిగుండె
కెలుకదు కలతన్॥

చం॥ 'కువకువ'యంచు రెక్కలవికుంచిత లీలలనప్పళించి, చం
చువులమరల్చియుత్సుకతఁజూపుచుఁ బ్రేమకులంచమిచ్చు జ
క్కవకవయెవ్వియో కలలగాంచుచు లోకమెవిస్మృతించె తా
సపలనమర్చిబోయఁడొకయమ్మని యించుకయెంచబోయెనే?

శా॥ ఏరీచెప్పఁగలట్టివారు భువిలోనేవేళ కేమౌనో ? లో
కారాధ్యప్రతిభావిశిష్టుల, జగత్కల్యాణ సంధాయు కో
దారాచారులఁబుత్త్రులంగనిన మాతల్ గూటికింగుడ్డకున్
దూరమ్మైకడగండ్ల పాలగుచుఁజేతుల్ చాచగాఁజూడమే?

ఉ॥ తామొకమాతృగర్భమునఁదమ్ములునన్నలు నౌచుఁబుట్టి ము
న్నామెసురక్షణమ్మున నెయున్న మునిరముఁగ్రోలుచుండి, యం
దేమహితాత్ములున్ బ్రథితధీయుతులౌచునుఁగొందఱుంటయుం
దేమరికొందఱుద్ధతులు, దీనులుహీనులు నౌటఁజూడమే ?

కం॥ కాలమొ ! కర్మమొ ! ధర్మమొ ! చాలకమగు
ప్రకృతియో ప్రజాపతి కృతియో !
మేలునొ, కీడునొ ఎపుడేవేళకు నొనరింపఁదెలియ
వీలగునొక్కొ ?

తే॥ గీ॥ చిచ్చుముట్టించి మ్రుచ్చులురెచ్చఁగొట్ట
నిండ్లుకాలినఁ బిచ్చుకగూండ్లుకూడ
పాప! మా మధ్య మంటలోఁబడినయట్లు
గాయపడెనయ్యొ! ఆప్రవాసియునునాడు

సీ॥ కన్నీరు నిరతమ్ముఁగ్రమ్మ చుండునుగాని
పతిచెంతఁబలుకు నిబ్బరములొలుక
నేవేళకాతని కేమికావలయునో!
యని మంచమునువీడి చనదు వెలికి
పతి యీవిపత్తునఁ బాయుటెట్లని వగన్
మెదుకైనఁబెట్టదు మెలతనోట
"తనగతి ముందేమొ"? యను నూహలకు వెరచి
ధవునిఁబ్రోవగ దేవతలను దలఁచు

తే॥ గీ॥ నాయభాగ్యమె హేతువో యనుచుఁగ్రుంగు
పాపకడుపునఁ బడు వేళ పాపమేమొ?
యనుచుఁదపియించు మున్ బుట్టు నయ్యకొరకు
నెన్నొ రీతుల నా సతి యేడ్చుఁదలచి.

# అనాథ

చం॥ కలఁడొక వైద్యుఁడచ్చట నకారణసత్కృపుఁడౌ ప్రపూర్ణుఁడు
జ్వాలమతిజాతిపంక్తి మతసంస్కృతి భేదము లెంచఁబోఁడు, దీ
నులకెలమిన్ సహాయపడు నొవ్వగ నెవ్వరి నాడఁబోఁడు- తా|
ఫలముపద ప్రతిష్ఠఁదలపండటు మానవజాతి సేవలన్॥

ఉ॥ ఆతఁడు భక్తుఁడౌను-కలహాశన భక్తిఁ బదాలఁ బాడుచున్
జేతలులేని కూతలను సేవలొనర్చును-దీనబాంధవ
ప్రీతియొనర్ప నిత్యముఁదపించును దూషితదీనదుఃఖిత
వ్రాతముసేవఁ జేయుచుఁ గృపాపరుఁడై యొకకర్మయోగియై|

మ॥ ఆతఁడా ప్రాంతమునందు ఘోరతర హత్యాకృత్యముల్ మాన్పగా
జతనమ్మెంతయొ చేసెనొప్పునె? మధుస్యందమ్ము [illegible]హానలో
ధృతినైనన్ విరమించదాతని మహోత్యాగమ్ము నావిద్ధపీ
డితులన్ వైద్యచికిత్స సేయు పరిపాటిన్ మించె లోకాదృతిన్,

కం॥ తనభర్తకు నా వైద్యుని మనదీనచికిత్సఁ జేయు
మని వేడగ, స
న్మానమునఁ జికిత్సఁ జేసెను. కనరావేమైన మేలు
కల్గెను చిన్నెల్.

కం॥ తనశక్తి కొలది సాధన వెనుకాడకఁ జేసెనరసి
వెజ్జుడు కరుణన్
వెనుకాడె నా ప్రవాసుల మునుపటి దౌర్భాగ్యమెల్ల
మోసముచేయన్॥

కం॥ ఇట్టుల రేయింబవలిక్కట్టుల కుందఁట్టుకొనుచు
కలవన్నియు తా
కట్టిడిఖర్చులఁ జేసెను కట్టా! విధి యామెయెడలఁ
గట్టిడియయ్యెన్॥

తే॥గీ॥ ఆశలడుగంటె దీనప్రయత్నమెల్ల
వ్యర్థమయ్యెను వైధవ్య యాతనమ్ము
ననుభవింపకఁ దీరనిదయ్యెనయ్యొ!
పతినిఁబాసిన లేమకు గతులుకలవె?

తే॥గీ॥ గోలుగోలున నేడ్చును గొంతుకి గుర
నెత్తినోరును మాటికి మొత్తుకొనును
అట్టెతలపోసిగాసిలి పట్టుఁదప్పి
క్రిందఁబడి చితుకునొక బొమ్మచందముగనె.

తే॥గీ॥ పసపుఁగుంకుమతో గ్రుంకె భాగ్యరేఖ
గాజుపూసల మోజులు కాలిపోయె
పూర్ణభావాను బంధమ్ము పుటుకుమనియె
సర్వసుఖ బోయె మిగిలెన సహ్యపీడ.

తే॥గీ॥ అస్తమించెను భాగ్యప్రభాకరుండు
చిమ్మచీకట్లు గ్రమ్మెను జీవనమున
క్రూరజాతులు నోర్విప్పి కొనెడి వేళ
నీ ప్రయాణము సుఖువుగా నెట్లుసాగు ?

కం॥ కనియాయనాథ యాపదఁగని కారవుమునముకఁజఁగి
కనులను నీరై,
కొనకొనలజార వైద్యుఁడు తనయింటనె యామెనుంచఁ
దలఁచుచుఁబలికెఁ॥

ఉ॥ సోదరి ! నీదుదుస్థితినిఁజూచితినేఁ గనులార, లేరుగా ?
ఈదరి బంధులెవ్వరికనే గతినుందువు ? తిందువేమి ? ఘూ
కేదియొ కొద్దిసాయమయి, యాపయినుండుము
మాదునింట నీ
కో దినమట్లనేకడచుఁ గూడునుగుడ్డ కొఱంతలేకయే.

తే॥ గీ॥ ఇటుల నెన్నెన్నొ రీతుల నెలమిజాలి
కలిగి వైద్యుడు పలికిన పలుకులాత్మ
దలచి గత్యంతరము లేనిదగుట నామె
యొప్పుకొని వారియింటనె యుండనేగె.

ఉ. లేరటయాత్మబంధువులు లెక్కకునెక్కుడో యున్నదక్కరన్
వారలు దూరదేశమిటు వత్తురె? ఘోరము కాలమహాట నే
దారియు గానరాక తలదాచగ తీరకచేరే నా మహో
దారుని యింటనుంట యుచితమ్మనియెంచియనాథమీాదటన్.

చం. తనపతి యెల్లవేళల హృదంతరమందు వసింప బ్రేమకుం
గనబడు నా సురూపమున నారతమశ్రుల తర్పణమ్ము స
ల్పును బలివెట్టునామె పరిపూత చరిత్రము, నార్తలోక సే
వనము వ్రతమ్మొనర్చుచును పాసనజేయుబ్రియార్పి
తమ్ముగన్.

కం. నెలగడచెనొ! లేదో! ఆ నెలతపయిన్ వెజ్జునాలి
నీచపుదృష్టిన్
తలపడి యనుమానింపగ గలతలు గృహమందుబుట్టె
గలికి బాగులగన్.

కం. చీటికిమాటికి నేదో మాటకు నా వెఱ్ఱిబోటి
మగనినిఁ దెగడున్,
మాటకు ననాథ నేదో పోటులనగ్గించి వేఁచు
పుట్టి[illegible]నించున్.

తే. గీ. చచ్చుతనమని శాంత్యహింసలను దిట్టి
భక్తి నొక వెఱ్ఱిగా నెంచు వారు లేరె ?
ప్రేమ దుష్కామమై తోచు పిశునమతికి
సత్యమాదర్శమౌనె యసత్యరతికి ?

ఉ. సంకుచిత స్వభావులక సంస్కృతిమార్గము లెస్సఁ దోచు ని
ష్పంకనదీప్రవాహమునుఁ బందులు మెచ్చునె ? తుచ్ఛవాసనా
పంకిలురై నిరంతరమపార్థములం గ్రహియించువారు తా
వంకలు పెట్టకుందురె ? యనక్రమనోహర భావజీవికిన్.

కం. లోకము చీకుది, ఆ యవివేకమునకుఁ గురియైనత్తృ
వెన్నుఙ, మన్నుఙ
ఏమనుజాకులుగాని కవాశ్యాన దేయమొక నాథ
బ్రతుకునఁ జితుకఙ.

ఆ. వె. హద్దుమీరిపోయె నా లివెజ్జండేమి
చేయఁగలడు లోన జివుకుచుండె,
ఎంతవారికైన నిల్లాలు చెడుదైన
గౌరవమ్ము నీట గలిసిపోదె ?

చం. అదటి సుపుంతలేక వినయమ్మునయమ్ము నిమ్ము సౌమ్ము నై
ముదమును గూర్చువారునయి ముఖ్యులునై పురుషుల్ చరించినన్
పదపడిభార్యదుశ్చరిత, పాత్ర్యయు, మూర్ఖ, యభాగ్యయైన నే
మొదవెడుకీర్తి వారలకు ? మూడెడుకీడును గోడుతోడుగా.

శా. దారిద్ర్యమ్ము భరింపవచ్చు వెతలన్ దాటంగనౌ వ్యాధినో
దారిన్ మార్పఁగవచ్చు, బ్రహ్మమునుసంధానింపగావచ్చు, స
చ్చారిత్రమ్ముగలట్టివారలకు లేశమ్మైనియిష్టమ్మనె ? యా
ఘోరక్రూరత రావమాన విషవత్కుంభీన సావానముల్.

తే. గీ. ఎంతయో ? యోర్చెనాదీన యీయవజ్ఞ
గాని, తనమూలమున వెజ్జుకలతపడుట
గాంచి యాయూరు విడిచిపోనెంచి యొక్క
రేయి తెగియించి యిలువీడిపోయెనయ్యొ !
"వెదకి దీనులకేవచ్చు వేయి వెతలు"

ఆ. వె. శరణుఁగోరి దేశసంకటావస్థలో
బలురకములవారు వయనమైరి
ఇట్టి కాందిశీకు లెందరెందరోకలా
రందుకలదు మనయనాథ యొకతె.

ఆ. వె. ఊడిగంబు జేయనొప్పుతప్పనఁబోదు
చేయిచాచియడుగ హేయమనును,
కూలినాలి చేసి కాలమ్ము గడపును
అలసిపోవునొంట బలములేక.

ఆ. వె. కొన్నినాళ్లుగడపె కూలినాలినిఁజేసి
యూడిగమ్ముఁజేసి యొకవిధాన,
అంతగర్భభారమధికమౌటంజేసి
అడిగికొనుట తప్పదయ్యె నింక.

ఆ. వె. అడిగికొంచు గొన్నియాత్రలు సాగించె
కడుపుకింతకూడు కట్టుగుడ్డ
కరువెయయ్యె నామె గర్భమ్ము బరువయ్యె
రూపుమారె పోల్చనోపరెవరు.

# భిక్షుకి

ఉ. పూతచరిత్రమై నిఖిలభూషణమై నిజదేశసంపదు
ద్ఖ్యాతికి హేతువై కళకుదోహదమై మహితప్రభావమై
ఖ్యాతినిఁగన్నదయ్యొ తమకాంతులఁబాసిన కామినీమణి
వ్రాతము చిచ్చు జొచ్చునటు వ్రచ్చును మచ్చును
మాయలేకయే.

శా. ఆ నిర్నిద్రదరిద్రతాద్రివ మహాహైన్యమ్మునన్మగ్ని యా
దీనస్వాంత, కఠోరగర్భధృతికెంతేనంత చింతింపదో !
ఆ నైరాశ్యతమస్తమస్వినుల బాహావ్యాప్తినాలుప్తమై
లేనేలేదొక లేతవెన్నెల మెయిన్ లేబ్రాయమున్నే యహా.

ఉ. చింపిరి గుడ్డకట్టుటది చింతలబొంతలకుట్టు మేనిపై
బింపిరి పట్టుబట్టలవి పేదలబాధల కాటపట్టు ని
మ్నంపు నిరాశదృష్టులవి మానవసృష్టికి నష్టపృష్టలే
కొంపనొ ముష్టికైయడిగి కొలదిదేశము గోలవెట్టుటే.

చం. ప్రణయతరంగ డోలికలపై మధురమ్మున గాథమైన జీ
వనపథమందు మోదమొదవన్ బయనించిన యా విలాసనౌ
కనఁనిటులోతుఫాను పెనుగడ్డయియడ్డుట మున్గుచుండె నెం
దునుదరి జేరునే ? సుడినథోగతిఁబట్టి మునుంగకుండునే ?

చం. ఇదియొక సిద్ధహస్తుడగు నీశ్వరశిల్పి యనల్పకల్ప నా
భ్యుదయము జూపి మానవవిభూతినిలో తునెఱింగి నేర్పుతో
పొదిపిన ప్రేమమందిరమపూర్ణమునై శిథిలావశేషమై
ఉదఁగనుచుండెనిట్లు పరిభూతధరావివరాంతరాప్తమై.

చం. మొలకలఁద్రోసి మోసలకు ముచ్చట రేకులమూసి లేగొనల్
మెలికలువాసి పూతకెలమిందలపెట్టిన తీవయిద్ది, జా
బిలిచలువన్ వలంచి తొలిఁబెట్టిన యాకళికమ్ముసింక నీ
వలఁగనరాదు వ్రేటుపడె వాడుటమాడుట గూడ చూడనే?

చం. కఱగిన గుండెలో, మఱిగికారిన బాష్పపు ధారతోనదే
కరుణరసమ్ము జిమ్మునొకగాజు కలమ్మునుఁజేత బట్టి యే
బరువు భరింపలేని అతిభావుకుడే కవివ్రాసిపెట్టెనో ?
చెరగుచునున్నదీ కవితజీర్ణములై విడిపోవపర్ణముల్.

చం. ముడియిడలేదు జుట్టునటుముంగురులన్ ఎగబెట్ట బోదుముం
దడుగిడలేదు, నోరుతడియూరిన నూరటలేదు గోడునన్
తుడువగలేదు చెమ్మటలు తూలుచుఁదూలుచుఁబోవుదీనయే
గడపనొకూర్చొనున్ క్షణము, గర్భభరమ్మతిదుర్భరమ్ముగాన్.

శరణార్థిని

తే. గీ. అదినిదాఘోగ్రకీలా విహారవేళ
అంటుకొను భూమినడుగిడ మంటలెగసి
ఉగ్రనిశ్వాసముల నించుచుండె ప్రకృతి
కాని యాకలిమంట యద్దానిమించ

అర్ధనగ్నతనుద్విగ్నయై కఠోర
గర్భభారమ్ము దౌర్భాగ్య ఘటభరమ్ము
అణచివేయుగ నడుగులోనడుగు నిడుచు
నొడలుతడియగ జెమ్మటలూరిపార

కండ్లు పొగరులుగ్రమ్మ గద్గదముగదుర
'అమ్మ ! అమ్మయ్య' యనుచు నే గుమ్మమునకొ
దీనభిక్షుకి చనునదే దేవురించిఁ
శూన్యభిక్షాకపాలమ్ము జూచుకొనుచు.

ఉ. ఆకనుదోయిలోఁదొలుకునశ్రులు క్షుబ్ధహృదంతర వ్యథా
భీకరదావకీలలఁదపించి ద్రవించి స్రవించి యా విరుల్
పైకొను తేనెతెమ్మెరలు భగ్నవిలగ్న మనోరథమ్ములే
గాక ప దేశ దే యుడుకుఁగ్రమ్మిన నిశ్వసనమ్ము జిమ్మునే ?

ఉ. నిండదు భగ్నపాత్రమది, నింపుతలంపును లేదు, ఎవ్వరో
గుండెకలట్టివాడు తనకో కబళమ్మునుఁబెట్టనుందురం
చెండినయాస నూతఁగొని యేగుచునున్నది దీనురాలు, త్రో
ఁడెండిన యాసురాలి సుడిలెత్తిన గాడ్పున ముక్కలైచనన్.

ఉ. 'పక్కన' నవ్వదే! విరగ బాటున చేటుకు లోకమెక్కిళుల్
బెక్కలువచ్చుదాక పరపీడన క్రీడనకాగ జూడదే!
కక్కులకల్లమైనియతి, కాలముగాలము గాగ తిండికిన్
గక్కురితై యెవల్ జివికి కాలినవారికి లేనుబంధుగుల్.

శా. నారీత్వమ్మొకదుర్బలత్వ మదియు న్వైధవ్యమున్ ప్రాయమం
దూహూరందినుగాడు లేమియును, మున్నోగర్భిణీ దుర్దశా
ప్రారబ్ధమ్మునుఁగల్గ లోకమునరవ్వారంట్టు కేలోటు? యె
వ్వారో! 'జాతిసహానుభూతి'యని కబ్బమ్ముల్ సెప్పగా
లాభమే!

ఉ. ఆకలిమంటమీద నపహాస్యమవజ్ఞయునింధనమ్ములై
సాకగమున్నె వ్రేల్చబడిచచ్చె మనమ్మభిమానమైన నీ
లోకపుఁదీపియేది తనలోకలదో! అతిదుర్భరమ్ము ని
త్యాకులమైన జీవనము త్యాగము సేయఁదలంచదయ్యయో!

ఉ॥ "మైనముకాదు మీ కడుపుమంటల కుంగఁగంగపాకఁబా
రేనలరాతిగుండెలవి, రిత్తగఁబోవునె మీ యుసుర్ల ఘా
టైనను, నూర్పువేడిపొగ రైనను తాకదె? ప్రేలిపోవ? రే
పైనను చక్కచక్కలయి పాటునకట్టడియుండు పొందవే!"

తే॥ గీ॥ "అరయఁదుఃఖాంతమైన యే కాంకి యిద్ది
చివరిదీ దృశ్యమును ప్రదర్శించుచుండె
సూత్రధారియు, నేర్పరి, పాత్రముచిత
మైనసామాజికులు హృద్విహీనులగుట
తద్రసానుభవమ్ము సుంతైనను లేదు."



# శరణార్థిని

తే॥ గీ॥ చండమార్తాండ భీకరజ్వాలనమును
దట్టుకొనలేక ఒకనీడపట్టుఁ జేర
నతిప్రయత్నముతో నడుగడుగునిడుచు
నామెయొకయింటి యరుగుపై నడుగు బెట్టె.

కం॥ "అమ్మా! కుత్తుకతడిలేదమ్మా! నీళ్లీయవమ్మ!
దాహముతల్లీ!
నిమ్మళములేదు నిలబడఁ గ్రమ్మును జీకట్ల"టంచు
గాసిలియడిగెన్.

ఉ॥ "కూటికిగుడ్డకున్ స్వదకికోంచు శ్రమించుచువిశ్రమించ నో
గూటినిచోటులేక తమగోడులెతోడయి చెట్టునీడ నా
నాటికిఁగాలమున్నడపు నగ్నదరిద్రులభగ్నముద్రలన్
నూటినిఁగోటిచేసిన యనూనధనాంధులు గాననేర్తురే?"

ఉ॥ "మంచు, గులాబివాసనల మాదకద్రవ్యము శర్కరాదులన్
నించుచు మేలవించి మధునీరముద్రావుచు సేవలందుచున్
మించులవీవనల్ తిరుగుమేడలపై పవళించువారి కొ
క్కించుకయైన దీనులనికృష్టతపై తగుదృష్టియుండునే?"

తే॥ గీ॥ 'భుకుక్కు-భుకుక్కు'ని యరచుచుఁ గుక్కయురికె
పక్క హేమక్కలోపాప 'బావురన' చ
'టుక్కుమని' లేచె శ్రీమతి పక్కనుండి
చక్కకొని పోయెఁదల, రౌద్రమెక్క భామ !

తే॥ గీ॥ "ఎవతెవే ! దయ్యమా ! గడపెందుకెక్కి
నావె, 'పో' 'పోవె' పింజారి!లేవవేమొ ?
ఓసిరాస్కెల ! బద్మాష ! ఒసలవేమొ ? "
అనుచుఁగోపించి కారులనరచె భామ.

తే॥ గీ॥ "అమ్మ ! దయలేద ? నిండుచూలాలినమ్మ !
దాహమగునమ్మ కుత్తుకతడియిగిర్చె"
ననుచుఁ బ్రతిమాలు నా యభాగినిని బట్టి
తిట్టికొట్టగ జేగట్టబట్టె భామ.

తే॥ గీ॥ ఉక్కచే నిద్రపట్టక యుబుసుపోవ
ధూమపానమ్ముసేయుచుఁదూగుకుర్చి
పైనఁబత్రికఁజదువుచుఁబండుకొన్న
నాగరకుడైన ఆయింటి భోగియపుడు

విసిగి కోపించివచ్చెను వెలికి నులికి ;
అన్నిరీతులఁదనపిర్యురాలి ననుస
రించుచుండుట యే వ్రతమంచు నెంచె,
అందుకొనెకట్టి దీనపై నాచివిసరె.

ఆ మదాంధుడు గనుటెటుల లామెదశను ?
ఉచితరీతినిఁ బోవగనోపుటెట్లు ?
వెలితిగుండెకు లోకము తెలియుటెట్లు
ఇందుముందున నేమౌనో ! ఎరుఁగుటెట్లు ?

ఆ కఠోరుడు కర్కశహస్తమెత్తి
విసరికొట్టినకట్టియుఁ గొనసులేక
తగిలెనా దీనభిక్షుకితలకుఁ బగిలి
రక్తధారలుబారె బరాబరుగను.

తే॥ గీ॥ మండుటెండకు నొకపిట్ట మఱిగిపడియె
నిండుచూలాలు తెలివిలేకుండఁబడియె
పిండ మా గర్భమునపట్టె పెనచుకొనియె
గండుధనికుని పాపమ్ము నిండుకొనియె.

కం॥ 'ఝల్లు'మనగుండె తలుపులు 'ఫెళ్లు'మనన్మూసె ధనిక
భిల్లుడు, జనులున్.
'గొల్లు'మని చేరిరట మూర్ఛిల్లిన యా దీనకుపచ
రించిరి తల్లుల్.

కం॥ "పెట్టకపోతేపోయెను కొట్టగ తెగులేమి ? చేయి
గొడ్డలు కట్టా
చిట్టముఁగట్టెనె? 'గుండెలు' " నిట్టులనొగిఁదిట్టుచుండి
రింతులువంతన్.

తే॥ గీ॥ లౌకికము నాగరకతయు మాకుఁ తెలియు
ననుచు గర్వించి పత్రికలట్టె త్రిప్పు
సహజమాదయ, సౌశీల్య శాంతవృత్తు
లబ్బునే గబ్బిలాలకు డబ్బుగలుగ ?

తే॥ గీ॥ కఠినులై స్వార్థపరులౌచు, గర్వపడుచు
నున్నవారికి నధికార మొప్పుపదవి,
గొప్పచదువును, ధనమును, కులముకలుగు
టదియు లోకమ్మునకు ముప్పెయౌట, నిజము

తే॥ గీ॥ ఛీ-చి ! యీ నిష్ఠురుల దలంచినయఘమ్ము
వరలు వీరలె పాపాల భైరవులన
ఈ కసాయిల యఃనాసులింకెత్త రాదు
ఆ యనాథకుఁగాఁగలదంతయయ్యె.

వెనుక నా తుచ్ఛభోగికి వేనవేలు
ఖర్చులైనను శిక్షలు ఖైదులైన
దీనబ్రతుకునె ? దుఃఖమ్ముతీరునొక్కొ ?
ఆమెకథయింక దుఃఖాంతమౌను దల ప.

ఉ॥ లోకపుమాటపోటు, పతిలోకములే వీడి, రాట్టుచేటుగా
ప్రాకుక్షుధా పిపాసలను పాములకాటును, తోడులోటు, నా
పాకభరోదరమ్మదిరిపాటును, వ్రేటునఁగల్గిగాయమున్.
సోక్షిహతాత్ప్రిసూతియగు సూచనలయ్యెను బోటికక్కటా !

తే॥ గీ॥ దయయు స్త్రీత్వాభిమానమ్ము ధర్మరతియు
పెనఁగికొనఁజూచి యీ దీనవనితగతిని
అచట లేమలు సంభ్రమాయత్తలగుచు
నెట్టులెట్లులో చాటునఁబెట్టిరిట్టె.

తే॥ గీ॥ వలయు నుపచారములఁ జేయ వనితలెల్ల
తెప్పరిల్లుచు నా దీన తెరచికనుల
బ్రసవమగుటను గుర్తించి భయముతోడ
నొడుకుచేతుల మునుఁజాచె బుడుతఁగడవ.

ఉ॥ కాకులమూకలై పదునుకాచిన మేకులుబాకులాచు నే
కాకిగఁజేసి లోకులటు కారులఁగూయుచుఁగోరలాని చీ
కాకునుఁబెట్ట నోర్చుకొనె గాఢదరిద్రము ముద్రిఁగొట్ట ని
కాకనుసుక్కె నీ శిశువుగల్గెడునన్ గలగాంచికాదొకో !



# మాత

సీ॥ చిదిమిన బాల్‌గారు చిన్నారి వయసులో

పిల్లబొమ్మల నొడిఁబెట్టునమ్మ

ముద్దులొల్కెడు లేతమొలక ప్రాయమ్మున

పిన్నపాపల జంకఁబెట్టు తల్లి

తరుణియై రేబవల్ తాగన్న కడుపుకై

తీపికలలఁ గాంచు దివ్యమాత

'వంశకర్తయగుచు వర్ధిల్లు మా బాబు'

అనుచు బొత్రుల యూహా దనియుజనని

తే॥ గీ॥ మధురనిస్స్వార్థ ప్రేమసామ్రాజ్య భద్ర

పీఠిపై మంగళస్నాన ప్రీతితోడ

తనువు, మనసును, పని, యేకతను నమర్చి

బలియొనర్చెడు మాత సంబరము పడదె?

(ఎట్టికష్టమ్మునను పుట్టుపట్టి కొరకు)

చం॥ పులకితయైన పృథ్వి, యరపూచిన పూవుల తేనెవెన్నెలన్

గలకలలాడు వేకువవికాస విభూషితయానుషస్సు, తో

ల్దొలుత సువర్ణరేఖలనుఁదోచెడి తూరుపుకై తనేరుపై,

యలరెడు తల్లిప్రేమ నరయన్ గలవారలె ధన్యులీధరన్.

సీ॥ స్వార్థరహితము నీర్ష్యా విరహితమునై
మమతామహత్వ మీ మాతృప్రేమ
శుభకామనామేయ శోభాసమేతమై
తత్వసుందరము నీ తల్లిప్రేమ

హేయనిష్కాసమ హింసావినాసమ్ము
జ్ఞానోదయమ్ము నీ జననిప్రేమ
ధర్మకవచముగా నిర్మలకర్మల
నెమ్మిరక్షణ జేయునమ్మప్రేమ

తే॥ గీ॥ త్యాగసద్యోగ సాధనోద్యోగ భాగ్య
మనుపమానంత వాత్సల్య భరితచరిత
మమృతమున్ వాగగోచర మచ్ఛమైన
మాతృప్రేమయె భువి పరమాత్మయనగ.

శా॥ ఆ మాతృత్వ పవిత్రభావనలు బాల్యావస్థలో నాటలన్
లే మొక్కై, ప్రథమార్తవమ్మునఁజివుళ్ళైపూవులన్బూచుచున్
సీ మంతోత్సవవేళకున్ మధురసోత్సేకమ్మునన్ బిందులై
యే మూడాఘననో ఫలించిరసమెంతేఁజిల్కుసుస్తన్యమై.

ఉ॥ హైందవ సుందరీమణుల యందుఁగలట్టి పవిత్రసంస్కృతుల్
గ్రిందును మాతృధర్మమువికాసము పొందిననాడె, నాడెయా
నందములే మకుందన సమాజమునన్ బ్రతిపత్తినాడె, స్వ
చ్ఛందతనాడె జీవితపు జాలున జాగృతిసార్థకత్వమున్.

కం॥ కనిపెంచిన తల్లుల కుంగనికారము మెండు కష్ట
కాలములందున్
తనవారిమించి యుపకృతి వెనుదీయకఁ జేతు రెట్టి
వెలదికి నైనన్.

తే॥ గీ॥ ఎందరో! చేరిరందును ముందు నడుము
కట్టి యా దీనయుపచార కార్యములను,
శ్రద్ధగా జేయుచుండెను శాంతయనెడు
కాంత పేరుకు దగినది కరుణగలది.

చం॥ కరువతిఘోరపాటఁ దమకాయముదక్కవయాటభర్తకున్
బరువగునట్లుఁగాక సదుపాయముతోఁబొదుపైనరీతి ని
ల్లరసియొకింత తీరికను వ్యర్థముసేయదు కాలమామె, త
న్నిరుగుపొరుంగు మెచ్చుకొననింతులకెంతయు మేలుబంతియై.

కం|| గంపెడు పిల్లలుకలదియు నింపైన మనమ్ము కలది
నేర్పైనదియున్
సొంపైనగానముకలదని, యెంపుడుగాఁజెప్పుకొందు
రెందును నామెన్

ఉ|| ప్రక్కనెయున్న యామెఁగని పల్కనభాగ్య నవప్రసూత ము
న్నొక్క నిమేషమాత్రము కనుంగొనె పాపను పాప!
యంతలో
బిక్కమొగంబువైచి నిరుపేదమనంబున నేమితోచెనో!
చెక్కులనిరుజార తనచేతిని ఆ యమచేతియందిడెన్.

తే|| గీ|| "అక్క! మాటాడఁజాల నాయాఁగమగును
పెంచిపెద్దగఁజేయు మీ బిడ్డనీది
దయతలంచుము తప్పుగాఁదలపకమ్మ
'అమ్మ'యని పిల్వ నీవె నేనగుచు విందు

నప్పుడె శాంతించు నాయాత్మయనుచు నమ్మ
మక్క! 'ఒకమాట' ఈ లేఖనందుకొమ్మ
భద్రముగనుంచి పాపకుఁబ్రాజ్ఞతఁగని,
ఇమ్మ ఇద్దియె నే దాచి యిడినసొమ్ము.

అనుచు నందిచ్చి యాయూస మధికపరాట
కనులమూసెను దీనాత్మతనువుఁ బాసె,
పత్రిమున్ బిడ్డనందెను భద్రిమహిళ
కరుణయుప్పొంగఁగన్నీరుఁగార్చి రంత.



# సందేశము

తే॥ గీ॥ కాగితముఁజూడనుత్కంఠ కలుగనంత
జదివె నా చాన కన్నీటు జాలుతుడిచి
పుట్ట బోయెడు పాపసంబోధనమున
నా యభాగ్య స్వసందేశ మాలిఖించె.

ఉ॥ మాతఋణమ్ము దీర్చుకొనుమా! కనుమా నిజ మానుషత్వ మే
రీతిని పూతమౌనొ, విపరీతమతమ్ములనమ్మఁబోకు మా
చేతల నీతివార్తల విశేషతఁజూపుము మర్త్యజాతికిన్
జేతన మొప్పగా నమరజీవివి కావలె నీవు పుత్రికా.

ఉ॥ జాతిమతాది మార్గములు సంకుచితమ్ములు పం[illegible]కకంట కో
పేతములట్టుఁజేసి యవివేకులు మ్రుచ్చులు విశ్వసౌహృదా
ఘాత మొనర్చు చిండిరిక కావలె భావవిశాలమార్గముల్
ఆతలఁపుల్ వెలార్చుము నయానునయమ్ముల నీవు పుత్రికా!

ఉ॥ మూతలుపడ్డవై మురిగిముక్కుచునున్నవి మూలసూత్రముల్
తాతలఁగోతులట్లరసి తాముతలన్ దలఁబెద్దలైరి, ఏ
కూతలొవార్తలైవెలయు కూటికిగూటికి వాచిరెందరో!
నీతిబలమ్ము కావలయునిప్పుడు నీ వదికూర్చు పుత్రికా!

ఉ॥ ఈతకులోతుకల్గునె ? సహిష్ణుతకుఁ బరువేది ? దీక్షకుఁ
శ్రాతయుఁగ్రొత్త లేదు, ప్రతిభాయుతుఁడొక్కఁడెచాలు విశ్వవి
ఖ్యాతిగ సర్వమానవ సుఖంకరుఁడై చనునగ్రగామియై
ఆతని వెన్కనన్నియుఁదమంతటవచ్చును నమ్ము పుత్రికా !

ఉ॥ భూతదయా పరత్వమతి భోగవిరక్తియు విశ్వసౌహృద
స్ఫీతియు గల్గి దుర్మథనపీడిత జాతులనుద్ధరింపుమా !
మూతిబిగింపులఁ వెదకి మున్మనుకన్నులవిప్పఁజెప్పు మా
రాతిరి బేరగాండ్రిదరి రాలఁజరింపుము నీవు పుత్రికా !

చం॥ చదువధికారముఁ గులము,సంపదలియ్యవి దుష్టబుద్ధులఁ
మద మొదవించు; వారికి గనంబడరార్తులు, ధూర్తవృత్తి నా
పదలు ఘటింత్రు లోకమున వారలెవారికి లొంగకుండి నీ
హృదయముదిద్దుకొమ్మవల హీనమనస్కులదిద్దు పుత్రికా.

మం॥ సంసారమ్మిదిదుఃఖసౌఖ్యముల శశ్వద్భ్రాంతియోభ్రాంతిచే
హింసాహింస పథమ్ములేర్పడు[illegible]తమ్మేశక్తియో ! ధర్మ వి
ధ్వంసాయత్తులు హింసనేగుదురు సత్యాహింసనీత్రోవ, 'సో
హంసోహమ్మని' దీనబంధులు ప్రయాణాయత్తులా పుత్రికా !

తే॥ గీ॥ గాంగ నిర్ఝర రంగత్తరంగ గతిని,
భువనమోహన నవవేణు రవళిసరళి
ప్రేమవిశ్వాసముల మేళవింపుమిద్ది,
సర్వమంగళ మాంగళ్య సంగ్రహమ్ము





బ్రహ్మపుర శిరోమణి ముద్రణాలయములో శ్రీఅనంతత్రిపాఠిశర్మచే ముద్రితము